

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# కాళింగమర్దన

## యక్షగానము.



క॥ శ్రీరామదయానిధిసుర
యారాతివిరోధిసుంద ♦ రాకారమహా
ధీరావన త్వత్పదములు
నారాధించెదనువేగ ♦ నన్నేలఁగదే.

ఉ॥ సారసనేత్రునిన్ హరుని ♦ స్రష్టను సింధుసుతన్ భవానినిన్
శారదనున్ గజాననుని ♦ సంస్కృత యాంధ్రకవీశ్వరావళిన్
కారణదేశికేంద్రుని వి ♦ శ్రుత భాగవతార్యవర్యులన్
కోరిదలంచి మ్రొక్కెద న ♦ కుంఠిత భక్తిరసంబుజిల్కఁగన్.

గీ॥ వాసికెక్కిన శ్రీభాగ ♦ వతపురాణ
మందుగలదశమస్కంధ ♦ మందుపూర్వ
భాగమునఁ యొప్పు కాళింగ ♦ మర్దనంబు
అందముగఁ జెప్పి హరి కర్ప ♦ ణంబు జేతు.

వ॥ అవధరింపుము కథాక్రమం బెట్టిదనిన.

గొల్లభామలు రావడము.



క॥ శ్రీకౌసల్యాతనూభవ ♦ పాకారినుతోదయుంజ ♦ భామవిశేషా
రాకాశశిబింబానన ♦ సాకేతపురీశ రాఘవ ♦ సన్మునిక్షేమా.

దరువు — ఆట తాళము.

గొల్లయింతులాము । వచ్చితిమింటను । మొల్లబంతులాము । వుల్లాసమునగూడి పల్లెలువచ్చాము । తెల్లదిరుగుటిపాలు చల్లాలునమ్మేటి ॥గొ॥ ౧॥ కంజనేత్రులాముా । కాంచనతుల్య మంజుగాత్రులాముా । వంజూరపర కంజ పుజములలో దైత్య । భృంగాయమానేత్రపొద్దు కెంజిల్లజేసేటి ॥గొ॥ ౨॥ నీలవేణులాముా । నీరదతూర్యద్ర శీలవాణులాముా । లోలాక్షి కాళిందికూలామునందున । చాలాగాతీగ సమయాలలూగుచుంటా ॥గొ॥ ౩॥ ధీరబంధులాము సౌగంధకర్పూరగంధులాముా । కోకిలకంటదొడ్డి పారజానుండైన । నారిజాతుని సారెసారెకు సేవించె ॥గొ॥ ౪॥

తెల్లవారకమున్నె దిగ్గునలేచి । యెల్లకోడెలకు చెయ్యెత్తి మ్రొక్కియును
స్నానముల్ జేసి వస్త్రంబులుం దాల్చి ॥ వూసిహరిద్రమున్పూసి కస్తూరి
తిలకముల్దీర్చి నూదితమైనకాటు । కలుదీర్చి పైడి భూషణముల్ధరించి ।
అల్లంబు సైంధవం బాగంగ రేణి । పల్లవంబులగూర్చి పైడికుంభముల
దధిద్రచ్చితద్దయు ద్రచిజేసినట్టి । అధిక తేజోవంత మైనట్టిచల్ల
ఘటములనింపి చక్కగనమ్ముటాకు । దిటమున వేంచేసితిమి మిట్టదొడ్డి
పురనివాసుండయినభూసురాపతిని । స్మరియింపుచును మేముజంట బాయకను

గొల్లభామల కీర్తన.

చల్లోయమ్మా । చల్లగొనరెకోమ్మా । తెల్లనిచాయల నుల్లసిల్లెడి
గొల్ల ॥చ॥ ౧॥ పాలోయమ్మా । పాలుగొనరెకోమ్మా । నీలములకునరిబోల
నిత్తుము గొల్ల ॥చ॥ ౨॥ వెన్నోయమ్మా । వెన్నగొనరెకోమ్మా । పున్నమ
చందురుకన్న మించుగొల్ల ॥చ ౩॥ నెయ్యోయమ్మా । నెయ్యిగొనరెకోమ్మా
చయ్యనమిట్టదొడ్డి స్వామికింపగు గొల్ల ॥చ॥౪॥

సీ॥ మద్దుకృష్ణునితోడి ముఖ్యంబుగను యాట ♦ లాడుచుండెడి బోటినమ్మ నేను
చిన్నికృష్ణునితోడి చెంగలి పుచునవ్వ ♦ నవ్వుచుండెడి చానమ్మ నేను
బాలకృష్ణునితోడి పంతంబుగట్టియు ♦ నాట్యమాడెడి కొమ్మనమ్మ నేను
మేటికృష్ణునితోడి మేళంబుగను చెంగ్య ♦ నటుచుండెడియింతినమ్మ నేను
హరికిమెప్పైనపవి జేతు నమ్మ నేను ♦ నమ్మతిగ గౌరినర్పింతు నమ్మ నేను
నందనుతునందముగదల్తునమ్మ నేను ♦ లెమ్మకంటినిగను గొందునమ్మ నేను

కీర్తన.

నందయశోదా బాలసుందరాకార । చందనార్చితమౌని బృందమం
దారా ॥నం॥౧॥ వేణుగానలోలచక్రి పాణిగోవిందా । క్షోణిభారదూరదీన
త్రాణపానంద ॥నం॥ ౨॥ కేకిపింఛామాళ సద్వివేకసంతోషా । గోకుల
భూమ కల్యాణశ్లోకసంభాషా ॥నంద॥౩॥ చారుమిట్టదొడ్డి పారినీరజేక్షణా
వరదాభయకాయ సత్యవారరక్షణా ॥నంద॥ ౪॥

వ॥ అమ్మా! మాయిండ్లకు మేముబోయివత్తుమేకోమ్మా.
పద్మగంధి మొదలగు నాగకన్నియలు రావడము.

గూడి చెలి యొకతె ముక్కావలు చేయగను । వేడుకొనక యింతి విడియంబు లొసగ
తలిరుబోణొకతె చందనమలందగను । జలజాక్షి యొకతె హెచ్చరికలు జేయ
నెలత యొకర్తె పన్నీరు జల్లగను । పొలతి యొక్కతె మల్లెపువ్వుల బంతు లివ్వ
పంకజాక్షులు కాంత పంఖాలు విసుర । పొంకముగ రాణి పుష్పాడి పలువ
లవిరళంబుగ దాల్చి సభికులాల్ వన్నె । కలికి లుదొడగి నేత్రములననువైన
కాటుకల్ బెట్టి చక్కని సొప్పులందు । పాటల బులుముడిచి పాపటల్ దీర్చి
సొంపు ఘటించు కస్తూరి తక్కబొట్టు । యింపుగ జేర్చి వాలికసుగంధంబు
మెలది నురరత్న చామీకరాభరణ । ములు ధరియించి యీ ముద్దియలతోటి
పసిడి పల్లకులెక్కి భాసురభక్తి । పోసగ మిట్టదొడ్డి పుర శౌరి నెంచి
వచ్చితిమి లకుజవ్వని తెర వెళ్ళ । యిచ్చతో మహిమలిక దెల్పెదాము

తెరవెళ్ళేకీర్తన.

నాగకన్నియలమే వోయమ్మా । యేపురము గూడివేగ తెంవెళ్ళ దామెమ్మా ॥ భూగగనచర స్త్రీగణములు మము । బాగుగాగని ముదిలో గొసియాడగ ॥నాగ॥ ॥౧॥ ఆణిముత్యములసరులు జారా । కాంచనభూషశ్రేణిబహుకాంతులొందమిరా ।క్షోణిలోన సరకేణు యానములు । జాతగల్గి సురరాణులుమించిన ॥నాగ॥ ౨ సరసీరుహాక్షులతోను యెల్లపుడు మేము పరమానురాగమొందుచును । అరుదగ మిట్టదొడ్డి పురినిలయుండగు పరమాత్మని సంస్మరణచేయుచును ॥నాగ॥ ౩॥

ద్విపద.

కన్నియ వినవె నిక్కము గమా యొక్క । విన్నపం బంత సవిస్తరంబుగను
విమలభాషలు గుల్క వినుపింతు నేను । కమలజుడైన కశ్యపుడు మామామ
అత్తలు పదము వ్వలందులో వలన । దుత్తముల రాలు కద్రూపపుత్రులగు ద్వి
త్రింశతిగుడుసు వృదేవరలు సప్త । వింశతిగురుమరుగలి వీరిమధ్య
నవతరించిన కాళియాహి నాయకుడు । ధవుడు నాగేశ్వరుడు తండ్రిగారమ్మ
నవనీలవేణి యెలనాగ మా తల్లి । పల్లవారుణ పాదపద్మలగు వీరు
చల్లెంద్రుడు నమ్మ ఈ చెంగలాక్షులాకు । యొప్పునా మను వినుమొయ్యనరు చర
కెప్పయీ యింతి కుంకుమగంధియావ । దూటి సుగంధియాతో యజవేణి

యకుని దలచితె మోక్షముసులె ॥కో॥ ౨॥ పాలాలగంధులతో ఆటాలాడు చును । నీటుగా నాట్యము మాటికివేడవలె ॥కో॥ ౩॥ దోషాములన్నిటిని తో సేభవాంతకుని । భాషాలెన్నిత్యాము విశేషమెనమ్మవలె॥ కో॥ ౪। మేలుగరా మదాసు నేలినమిట్టాదొడ్డి । ప్రోలూనివాసుమదిఘాజాలుచేయావలె॥ కో॥ ౫॥

రుధిరాక్షుడు రావడం దరువు - ఆదితాళము.

అక్షీణాభుజవిక్రమ తాక్షోణీసమరాగ్రదక్షుడనేనురుధిరాక్షుడనురా అ॥ ౧॥ వీర్యావిహీపునిర్వికార్యములు నెరవేర్చి శౌర్యాఢమేం సుధైర్యుడరా॥ అ॥ ౨॥ అష్టదిగ్వేదండ ప్రముష్టిమీరినబాహు । నిష్టుడపరిపంథి నష్టుడరా ॥ అ॥ ౩॥ క్ష్వేళానలస్ఫీర జ్వాలాజాలము చే దిక్పాలులాలగెల్చెద్ధృతాశూరుడరా॥ అ॥ ౪॥ మిట్టాదొడ్డియను పట్టణేశ్వరుకరుణ బుట్టానుతించిన దిట్టనురా ॥ అ॥ ౫॥

గీ॥ ద్వారపాలకవినం సుద్వారవిచిత్ర
మహిపులను గాళీయాహీంద్రు మంత్రియనగ
నొప్పిచచ్చితినిటుయూ మహోరగేంద్రు
డిందువచ్చును యెనురునేడేగవలెరా॥

కాళీయుడు రావడము.



క॥ శ్రీగౌరీ హృదయేశ్వర సాగరతూణీరమాని సన్నుతలాఢ
వ్యాగమసారమనోవాచాగోచరధాతగిరి శాంతమహేశా॥

కీర్తన - ఆదితాళం.

కాళియాహివరేణ్యుడా । భాసురకీర్తి పాళిశోభితగణ్యుడా । మేళంబుగనుబల్ గరాళవాలముఖస్ఫ । వాళమానేక ఫణాళిశోభిల్లగ ॥కా॥౧ దివిజులందరుజూడగా । కాకోదరవిహారంబు గొనియూడగా । వివిధప్రవీణ శ్లాఘునశౌర్యమునుగల్గి । భువనమందఖిల గాత్రవులుభీతిల్లగ॥ కాళి॥ ౨॥ శూలముద్గరప్రాణమూ । తోమరడిండిమాల చందిహానమూ । వాలాదిఘనశస్త్రజాలాము చేబూని । కాలకూటనాళ కీలలుప్పతిలంగ ॥గాళి॥3॥ పరమానురాగంబుగా తప్పకచిత్తవరజీవ జాతింబునా ।అరసెమిట్టావొడ్డిపురిరాము దాసాఖ్య వరదమిత్రుని పాద స్మరణగావించియు ॥ కా॥౪॥

సూత్రధారునివాక్యం

క॥ భీకరతేజనులోలయది వాకరుచందముగ నిందువచ్చిన ఘనద
ర్వీకరమిూరెవ్వరో కరుణాకరవినుపించనయ్య నానందముగా॥



కాళియుని - ద్విపద

ద్వారపాలకవినర మద్వరప్రతాపంబు । సారెసారెకుమీరి జగతిచెన్నొందు

బి॥ సరోజాక్షులందు । స్మరసుందరుండవై యుందు। ధరామిట్టదొడ్డిపురిరామదాసు । శరణ్యానెద సంస్మరింపుచుండెడి ॥బి।



మంత్రి సభ చేయుంచుట

ఆటతాళం.

సభజేసికూర్చుండీ। భోగీశదాసములన్నిటిచెండుడీ । విభవంబుగను పుంగ వేంద్రులానక్తిచే। శుభశాసనములు భాసురముగజేయగ ॥సభ॥సుందరమణులాడాగా । కాకోదర సందోహముసువేడగా । వంది మాగధశాస్త్రవాదిగాయకులంత । సందాడిగను తద్యశస్సుకీర్తించగ ॥సభ॥ హితులుగై సేయగనో । చామరుధీమతులెల్ల వేయగనూ । క్షితిమానవులు నీవిచిత్రంబుగనుచాల । నుతియించిసుంచి కానుకలం దివ్యగదివ్య ॥స॥ రామదాసునుభూరి । సవ్యుఖ్యమొసంగె శ్రీమిట్టదొడ్డిపురి। హేమాంబసపుదయం బెలమితోనెలకొన్న । కోమలాంబుదవర్ణు కోరినుతింపుచు ॥సభ॥

వ॥ అయ్యావసరంబున కాళియరాగుండు సింహాసనాసీనుండై మంత్రితో యేమనుచున్నాడు. దర్వువాదం.

కా—రుధిరాక్షవినరా । నెమ్మది కోన రూఢిచేగసగా । అధిక తేజోవంతమ మరలోకములలో । పృథుయశస్కుడనయ్యిపొలుపొందుచుంటిని॥

రు—సుధశేశధైర్య భాసురవీరగుణ్యా ప్రచార్య । పిధువిరాజిత కాయవేసు కతొవిందు । నిధమయ్యెదోనేడు విన్నవించుడివిందు॥

కా—యిలలోనాకడిమి । బల్మికిమానవులు భీతిబొడమి । నలువొందవారి ప్రాణములుగాచుకొనంగ । చెలరేగిమనకేమిచ్చెదరో వ్రాయుచు వివా

రు—బలువేడ్కతోను । దేవ్వేదవ్యాకులమంతమాను । నెలకొక్కసారి మానితభోజ్యములు మనకు । నలనొప్పయొసగి దివ్యాత్ములై నుండిరి

కా—అవనిజనములు మనకొసగెభోజ్యారెప్పణములు । సవినయంబుగమాకిచ్చుటికి బంపకవాటి । నెవరనుభవింతురా విధమేర్పరించుమి॥

రు—కువలయమందు । మనలగాచుకొసారమిందు । ప్రవిమలంబుగనిచ్చుభక్ష్యాదులనువక్షి । ధన్యునికర్పించి తద్దయునొప్పచున్నాము॥

కా—హీనవిచార । నీకపటంబు కేమనందురా । మానుగనాభూమాన్యతలెల్లపుడు । వైనతేయుడు మెక్క వాడెవ్వడో తెల్పు॥

రు—నేనొక్కరుడనూ । గాకఖిలధరణీశులనందరనూ । పూనిమిట్టదొడ్డి ప్రారిశౌరితురగముకు । దీనులై యిట్లువర్తిల్లుచున్నారుసుమ్మీ॥

క॥ జనులెల్లమనకునొసగెడి ఘనమైనయిరెప్పణములు ఖగపతికినిమీ రొనగూడిఁయిచ్చెకారణ మనమానుతేక తెల్పుమామంత్రియికన॥

వ॥ అనిన మంత్రియేమనుచున్నాడు

క॥ ఉరగవరారెప్పణములు గురుమునికివకెట్లు యింతకాలముధరనీ వరదుగి బ్రికుకున్నాడవొ స్థిరముగ దెలియంగలేనేదిత్తములోన॥

కాళియునికి మంత్రికిని వాదము ఆదితాళం.

కా—ఓరిదురాభిచారమాను యీవాక్యములన్ని
ధారుణితలమునందునేను । కారుమీరు మొనగాడనుండగను
భోరుపక్షిసిబొగడనేటికిర ॥వో॥

మ—దూరభారము తెలియకాను గర్వోక్తులిట్లు ।
సారేకుబలుకగానేలనూ । భూరిశౌర్యదర్పుడు యాశకుని
వీరునితోతగవిక వలదంటేను ॥దూ॥

కా—నన్నుమించినయట్టివాడ । ఇతఁగంబుననుబల్
జ్వరంగంబునందువోడ । కన్ననములోకంబుల నయినను
హెచ్చున్నతవిషతతినొంచి చేసెదను ॥లో॥

మ—పన్నాగధీశయిట్టులాడా | తగదునీకన్న
ధన్యుడాపక్షిరాజుచూడా ! మున్నుబలారియమహాఘువీర్యసం
పన్నతగెలచిన బాహుబాదయ ॥దూరబౌకము॥

కా—పాలివారిని పెంపుజేసి ॥ మాట్లాడకురనా
పాలిబలమెల్లగీసివేసి | చాలుచాలునీసాహసమెల్లక
రాళవాళబిదురంబుఃతీర్పొదఃవోరిమరాభిచారమాను॥

మ—గెలిచన్నిందువేగజేసి | చెడుకార్యము
దుశ్శీలాజేయకుమెదద్రోసి | లాలితమిట్టదొడ్డిప్రోలునివాసుని
లాలనార్వమునులఘ్యపెట్టుమిక | దూరభారము॥

వ॥ అనినకాళియుండు నయనంబుల విస్ఫులింగంబు గురియ కో
పోద్దిపితమూఃనుండై యేమనుచున్నాడు



క॥ పగవారలనీగతి గొప్పగజేయుచునన్ను మానపరచితివిక న
మ్మగరాదునిన్ను సభలో తగదికపోహిమ్మదుర్మదకృతజాలా॥

వ॥ అనిన సంత్రి యేమనుచున్నాడు.

క॥ ఒడయుడయధికనిలోకదు వడికంటకమెుంచనలదు వలదంటెను చే
టుమగకదలచితివిక నీయెడనుండగరాకు జనియదెయ్యాడకైన॥

వ॥ అని సభామందిరంబునుండి వెడలిపోవుచున్న రక్షనయనునిం
గనుంగొని నజ్జకుంజని కాళీయుండేమనుచున్నాడు.

కాళీమునికి మంత్రికి సంవాదం.
ఆదితాళం.

కా — యెందుబోయెదవుమంత్రి యేమనంటిని | పందిమాగధమిళింప బృందముచే సందడిగలమన్మందిరంబువీడి ||యెం||

మం — సందేహమేమిచాలుచాలు పోవయ్యా | ముందునీవుసభదిమందిలోన బహునిందవరచిన వగలెందు కాకుమరి ||సం||

కా — వైనతేయమునితో చెలిమి వలదనలదంటె మానసమునపలుమారుకలగి సభలోన మమ్ములను రోసివేగయిక ||యెం||

మం — నీనేర్పుదెలసెనేనురానుపోవయ్యా | హీనభావమున పెడలుమనుచునగ బూనిపలికితుదబొంకనేమిటికి ||సం||

కా — నిన్నుయెడబాసి యెందునిలువజాలను చిన్ననాటిపెనుచెలమిదలుపకనె నన్ను విడచి సందనంబుదాటియిక ||యెం||

మం — తిన్నగమిట్టదొడ్డి దేవదేవుని పన్నుతించి విరసంబులేక తమసన్నిధానమునను జయదెంచితినొగి ||సం||

వ|| ఇట్లుమంత్రి కాళియోరగునిచే నభిమంత్రితుండై గరుడునిచే నాగేంద్రుండు చెడగలండని చింతించి అంతఃపురంబునకుంజని పద్మగంధితో యేమనుచున్నాడు. దర్వు వాదం

మం — యింతివినవమ్మ సంతోషముగను
విన్నవింతు యీవిధమెల్ల శాంతిమీరగనూ ||యిం||

పద్మ — మంత్రివరయా వృత్తాంతక్రమమూ
నాథాపంతము దీరవంతదెల్పుము ||మంత్రి||

మం — నీదుపతితాత్సుకానీతో కంటుదలచే
యిందుచేపుర్వేశులకే చేటురావలసె ||యిం||

పద్మ — వాదమేలయా వైనతేయునితో బూనె
పోదుగామంద్రాల పతిధైర్యమతితో ||మం||

మం — మానవులోనంగె మాన్యాత్రకోరకు
మనసులోవైరముగలిగె భోలాక్షిదోరకు ||యిం||

పద్మ—తానిటులఁజేయ తగదంచు వేడా
వేడ్కతో నీకు దెలుపాగదో చాగ ఖేదా ॥మం॥

మం—యెన్ని విధములఁ నేదెల్పినాను
వినదు కన్నియ యిక యెంతః నిజెప్పుదునూ ॥యిం॥

పద్మ—పన్నాగనుఁబ్రోవు పాహివినాశా
నేరామెన్నకుమని తల్లుమిట్టదోడ్డీశా ॥మం॥

వ॥ అని పద్మగంధి వధూమణులంగూడి సభామంటపంబునకుంజని భర్తతో వందనపూర్వకముగ యేమనుచున్నది.

క॥ వందనమయ్యా మనోహర వందనము భుజంగవంశ వార్థిహిమాంశా
వందనము హాలహాలాధర వందనము శరశ్చంద్రకుంద వర్ణఫణీశా॥





కాళియునికి పద్మగంధికి సంవాదం.

యోలలు

కా—ఇందీవరాక్షి నీమదిలో సందేహ మించుక లేకనుందికము కేతె చనేటికి
ఘనులుండగనుయిందు రాదను నామీబోటికి ॥యిం॥

పద్మ—సందేంమరుచిగాంగా వినునా డొందామూలో
వినుతింపుచును యెందుబోయిన యేమితో చాదు
సత్యంబులేని సుందరులకాలాటి మోసాము ॥సం॥

కా—తరుణినీవాశినమాటపరమధర్మోక్త్తలెకాని । గరితలును బెకడొందిరా
గానూ । రానేల నేడా కారణము దెలుపవే వేగనూ ॥యిం॥

కా—యింతిమిట్టదొడ్డిపురి కంతుజనకునిసాక్షి చింతనెమ్మదిలో నొందక
గరుడనిపాలపహారియింతు కటుకీర్తి జెందాక ॥గజ॥

వ॥ అనినమనోహరునికి మంజులవాణి యేమనుచున్నది.

సీ॥ వినరుమహాత్మ్యంబు వినవయ్య ఫణిరాజపరగమూతంద్రి జెప్పంగవింటి
మల్లిశాసనముతద్దయుగల్గి జలధిలోగలనివాదులను శీఘ్రిముసుమింగు
గజకూర్మములరేను కంబునుయొక్కటబట్టి కుప్పించిపుష్కరముకెగసె
అఖిలనదుల పుక్కిటదుంచినవలుకల్లార్చి సురయంతాత్రిహీనకట్టకూతె

గీ॥ దివిజపకుగెల్చి యమృతంబు దెచ్చిక్రాద
వేయునకొసంగి తనుగన్న వినుతభూరి
దాస్యమునుబాపె నిదిగాక ధైత్యభేద
సాహసంబయ్యె నతనితో వలకుకంటు.

పద్మగంధికి కాళియునికి సంవాదం

ఆటతాళం.

ప—వలకువలదయ్యా భోగివర్యా । నావాక్యముమదిలో
దలపవెందుకు నేరుధైర్యా । బలవిరోధిదేగల కులిశాద్రుని
దొలగించిన పులుగురేడుతోలసగ ॥వలదు॥

కా—చెలియవేవేగయిందురాకు । పగతుని నాయెదుట
చెలగిపెంపెత్తుజేయబోకు । వదలువిణిముల దుముకులుగలపలుకులు
బలికితెనినుధూతములగూల్చెద ॥చెలియ॥

ప—శరణుకోపించ నేలానీవు సంగరమందు
యూగరుడా మందునిగెల్వలేవూ । వురగనికరముల పొరిగొనగను
హాని వలమువడిసె ఖగవరునితోటిపగ ॥వలదు॥

కా—తరుణినినునమ్మరాను తెలసె వయిరులబాగజెటి
పరమారిరాలవంచుదెలసె ధరణిమిట్టదొడ్డి
పురిహారితురగము । కొరకునిన్ను త్వరగబరిమూర్చెద ॥చెలియా॥

వ॥ ఇట్లుపన్నగేంద్రుండు యోషాభాషణంబులను ధిక్కరించి మం
త్రితో యేమనుచున్నాడు.

॥ ఇదిమంత్రినన్ను వంచన వెదలేకనుచేసిపరుని వినుతించెనుయీ
సుదతీ తగదిటనుండగ సదనము వెడలంగదోోచి చయ్యనరమ్మా

వ॥ ఇట్లు కాళియుని యాజ్ఞ సిరసావహించి రుధిరాక్షుఁడు పద్మగంధి కేమనుచున్నాడు.

॥ తనమంకుతనకెపిమ్మట పనికామిణి దెలుసుకొని వాదించకే నీ
అనుకచెలులతోలంతిక మునకేగుమి పరుడుకోపమునుజేసెగక



పద్మగంధికి కాళియునికి మంత్రికి సంవాదం రూపకతాళం.

స్మ—చిలువరేడుకు మంత్రిశేకర సీతియు
పొలుపొందదెలిపిరా పొమ్మివేవేగ ॥చి॥
—సకలోపాయనములకలకు నాధిపునికిచ్చి
ప్రకటితంబుగ మేలు బడయాడిరాజా ॥సక॥
—వికటాత్మనీవెంత విన్నవించినగాని
వోకసారికయిననే నొప్పనీమాట ॥విక॥
—వెలదిరోనేనెట్లు విన్నవించినగాని
అలపన్న గేశ్వరు డాలకించాడు ॥వెల॥
స్మ—తిగదన్నపనులు జేయగరాదందురుబుధులు
నగుబాటుగాబోకు నామాటవినుడీ॥

కా — మగువానిను మదిలోననమ్మగరాదు పోపొమ్మి
ఖగరాజునవిలోన ఖండించగలనూ॥
పద్మ — మంత్రియింకొకసారి మనుధీశునకునీతి
మంత్రించిరిపుతో పగమాన్పుడిప్పుడూ
మ — బలవంతుతో భూరి చలము జేయుటహాని
గలదంత్రుణనామనవి కరుణించుడికనూ॥
కా — యిలలోననుబోలుఘనుడెందు లేడనుకొమ్మను విశ్వా
పులుగురాయనితోటి పోరుబెంతరా॥
మ — శ్రీమిట్టదొడ్డిపురి స్వామిసాక్షిగనేను
సీమనోహరుడు వీడింతిపోదలచే॥

వ॥ అని మంత్రివాక్యంబులువిని పద్మగంధి వాదయుటాపంబడ ని తెరంగెరింగి వయస్యలతో స్వకీయ గృహంబునకుజనియె కాళియుడుశోగి తాత్మునితో యేమనుచున్నాడు.

గీ॥ రక్తలోచన మనకువల్లవ్వులు వెరచి
యిచ్చుమాన్యతలాపక్షికివకనాకు
దెచ్చియివ్వడి వాటికయి తిరిగివాడు
వచ్చితెను గూల్తుయునిలోన వయిరమూని॥

వ॥ అనిన తాత్ముండు వృక్షంబులక్రింద గోపకునిచేనుంచబడిన భక్ష్యలేహ్యాది భోజనంబుదెచ్చియిచ్చిన మహామద పిశాచగ్రస్తుండైన కాళియుడు గ్రహించుచుండెనంత॥

## గరుత్మంతుడు రావటం.
### దర్వు - కీర్తన.

సంతోషమునచక్రి చెంతనున్న సువీర్యవంతుడా। నేగరుత్మంతుడరా॥
౧॥ మున్నుపయోధిలో నున్ననిషాదుల। నెన్నిమ్రింగినను ప్రసన్నుడరా॥ ౨॥
చెచ్చెరచనిదంతికచ్ఛపములనోట । గ్రుచ్చిభక్షించిన స్వచ్ఛుడరా ॥౩॥
జంభాంతకునిచేతి దంభోళికెదరివి । జృంభించెట్టి దోస్తంభుడరా ॥౪॥
రామదాసునేలే శ్రీమిట్టదొడ్డిశు ప్రేమయొగొన్నలలాముడరా ॥సం॥ ౫॥

సూత్రధారివాక్యం

క॥ దిక్కరులు భయంబొందగ రెక్కలువిరళించినంత రీతుంబుననే
డక్కనజనివిచ్చేసిన పక్కికులశ్రేష్ఠి నీప్రభావముజెప్పుమా॥

గరుత్మంతుని వాక్యం.

సీ॥ ద్వారపాలకవినర దామోదరునిబొడ్డు తమ్మిగోబొడిమె పద్మభవిసూతి
ఆపద్మజునిపుత్రుడగుమరీచిఋషి తామహాత్ము కశ్యపబ్రహ్మమజ్జనకుడు
దక్షప్రజాపతిసుతామణియగు వినుతాదేవినన్నుగన్న తల్లిపంక
జాతాప్తునకుమిగుల సారథ్యమునుజేసి రూఢికెక్కినయపూరుడుభ్రాత

గీ॥ సురవరునినభర్తోన పూజ్యుండనయ్యి
మాత్రుదాస్యవిముక్తి ధీమంతునయ్యి
ఆదినారాయణుని వాహనంబునయ్యి
దనరునాపేరువిను గరుత్మంతుడనురా॥

చర్వ. కీర్తన.

ఖగేంద్రుడను వినురా। రిపుకరి మృగేంద్రుడనురా। నగారిపురిని లోనగాకొడకను। అగోచరామృతము గాంచి తెచ్చిన ॥ఖగేం॥ నరుల్ విను తినల్ప। ఖచరామరుల్ బూరికొల్పా। ధరాధరులజిజ్జరాదిప్పించెరాంబరమున కెగరాజిమ్మగల ॥ఖ॥ బిలేశయుంబులనూ। ఘుసియులోనలింపుజేసెదనూ। చలంబుమదిరంజిలంగ పర్వాఖులనోట వ్రక్కలించివయచిన ॥ఖగేం॥ నిరంతంబుగను। మిట్టదొడ్డిపురంబు లోపలను। స్థిరానందమొంది రామదాసుకు। వరంబొసగ యుండిరేశుడలచెటి ।ఖగేం॥

మంత్రికొనియాడుట కీర్తన.

పక్షికులాబ్ధిసుధాకరం। నాగభక్ష దేదీప్యప్రభాకరం। అక్షీణబలనీనరక్షరక్షసమూహా। శిక్షకారుణ్య కటాక్షవీక్షణదివ్య ॥ప॥ వినుతవధూమణీనందన। భూరివినయనిషాదాళిగంధనం। అనగప్రమోద పావనపావకజ్వాలలను జల్లార్చిన భక్తావనభూరివిక్రమ ॥ప॥ శ్రీమిట్టదొడ్డిశువాహనం। చిలుకరామదాసానందజీవనం హేమధరాధర సోమసియామక స్థేమమహామృదు నామకృపాధి ॥పక్షి॥

గరుత్మంతుని వాక్యం.

గీ॥ వినరధీమంత రమణకద్వీపమందు
సర్పములునాకు భయమొందిజనులుతమకు
యిచ్చుమాన్యతలెల్ల నాకివ్వగలరు
గాన జనియెదనటకు శీఘ్రముగనిపుడు॥

వ॥ అని పతత్రివరుండు రత్నాకర ద్వీపంబునకుంజని పన్నగంబులతో యేమనుచున్నాడు.

గరుత్మతునికి సర్పములకు సంవాదం



గరు—పన్నగంబులార ప్రాభృతములువేగదెండి వేడుకొండి.
సర్ప—పన్నగవిను పక్షిపాలభోజ్యములింక లేవు మమ్ముబ్రోవు.
గరు—యిందులేకవాటి నెవరనుభవించిరికోరి తెల్పరోరి.
సర్ప—కంధిగంభీర మాకాళీయుండుపహరించెను వేవేగాను.
గరు—కాళిమోరగు డేలగర్వించి యీలాగుబూనె నీతిమాని.
సర్ప—బాలార్కతేజ యాపంతమెయ్యదో మాకుయేమితెల్సునుస్వామి
గరు—క్రూరాత్ముడగువాని క్రొవ్వడగించకమానా ధాత్రిలోనా.
సర్ప—ధారుణిమిట్టదొడ్డి ధామ డెగతి మాకుశిరా కీలేజాలా.

వ॥ అనిన ద్విజిహ్వగంబులకు పతంగరుం డేమనుచున్నాడు.

గీ॥ పాపలారనాదు ప్రాభృతంబులుగొన్న
కాళియుండుయెచట గలడొనాకు

విన్నవించుచున్నపుడు వినిపించరేని మీ
గర్వమణచివేతు కరుణమూని.

వ॥ అనిన భుజంగమ్ములు భయకంపిత మానమానసులై గద్గదస్వరంబున నంగలింపుచటుల విహగేంద్రునితో యేమనుచున్నారు.

క॥ ఆయ్యా దేవరవాక్యము లియ్యెడవిని భయముదోచె నెడ కాళియుడ
కాయ్యములో వసియించును చయ్యనవిని మమ్ముబ్రోవు సగుణవిచార

వ॥ అనిన విహంగాధిపుడు కాళియునివద్దికింజని యేమనుచున్నాడు.

పంచచామరం

గరు—మురాభిచారసేవ్రబల్ మదోగ్రకారివయ్యునా
అరిప్పణంబులుక్ నివారణంబొనర్చి మెక్కియే
తేరంగునిల్చి యుంటివో మతదియ్యభూరిశౌర్యముక్
తరంగజేతుజూడు పెద్దధైర్యముక్ చెలంగగక్

వ॥ అనిన విహంగభర్తతో భుజంగభర్త యేమనుచున్నాడు.

పంచచామరము.

కా—ఎవ్వడవ్వరసీవు నేడనేక గర్వమొందుచుక్
దవ్వనుండకేలయిట్లు దర్పమానసుండవై
చివ్వజేయలేక బల్వచించనేలరోరినీ
క్రొవ్వడంతుచూడు నేవరుంతితప్రదుండనై ॥

వ॥ అనిన నాగేంద్రుతో నాగభక్షుండేమనుచున్నాడు.

గరుత్మంతునకు కాళియునకు సంవాదం.

ఆదితాళం

గరు—పురగానినుబరిమార్చలేక నేమాన
నెమ్మదిలోపల నా తెరగు దెలియుక నున్నావౌరౌరా
సురగరుడాడొప్పరపరులగయుగ శిఖిరవాలంబుల గొరికినరిణీ ॥పు॥

కా—గరుడాపోరాడుదమిటు రారమ్మిభయమొందక
నాబల్కరలాఘవంబు జూచుకొన్ముు । నిరతముగలవరు
అరబలమొనవగ । నెరుకల మరిమురితరిగి వేసెదను ॥గరు॥

మంత్రికి కాళియునికి సంవాదం.





కందార్థములు.

మ — పన్నగాధిప నీవదిపరి । పరిగతులనుజిక్కి దుఃఖపడనేలయగో । చర
వాతగలను వినుమా । గరుడుడు జొరగానిస్థలము ॥దరువు॥ గలదో
క్కచోటా అదియొకరికి దెలియరాదాటా । అలజంబు ద్వీపమంద
లరు కాళిందిపై । వలినిపొంతక భూరి వైభవంబగుమడుగు ॥గల॥
కా — రుధిరేక్షణ సప్తపయో । నిధులనుగొని పుక్కిలించు నేరుపుగలదో
ర్విధుడై వయట్టి కైటభ । మధుహరతురగముకు చిన్న ॥దరువు॥ మడుగన
యెంతా । పక్షికిజొరబడరానిదింతా । పుడమిలో యదియట్లుబుంగు
చుండెదాని । పుడియాలో దెలుపుమి ఖగరాజునకుచిన్న ॥మడు॥
మ — మను సౌబరిమునియా । ఘనమాడుగున తపము జేయగను ఖగపతియం
దునగల్గు మత్స్యములకును । గొనిమెసగినజూచి మునిని ॥దరువు॥ కో
పింపుచూనూ । విహతికినిఘోర శాపమిచ్చేనూ । వోపక్షివర మళ్ళీ
యొకతేపై నీమడుగు । బాపుజేరితే వేసి తలవ్రయ్యలౌనంచు ॥కో॥
కా — ఓ మంత్రివర్య నీవు వ । మేమనిపొగడంగవచ్చు యిపుడానదికిన్ । కామిత
నవలెనంతిక హేమామాయ మునకు సేగి ॥దరువు॥ యికనాదుసుతులాదో
డ్కొనిరమ్మ యకళంకమతులా । ప్రకటామిత్రాదొడ్డి పౌరివాసుం
డయిన । వికచాబ్జనయనూని వినుతిజేయుచు నీవు ॥యిక॥

వ॥ అప్పుడు మనల్లకంటె నాగకన్యలవద్దికిఁజని యేమనుచున్నాఁడు.

గీ॥ కలికివినవమ్మ శరజాతగంధినీవు । చెల్లియాలఁగూడుకొని మహిశ్రేష్ఠుఁడుండు త్వరితముగరమ్మటంచు మోదముగనప్పు । డోలతారమ్మనంతోయంచేలనేను

వ॥ అనిన సోదరులతోఁగూడి పద్మగంధి పతియొద్దకుఁజని యేమను చున్నది.

పద్మగంధికి కాళియునికి సంవాదం

పద్మ—పురగేశ మమ్మింపుకొరకు యీసభలోకి
పరగబిలచితిరో యేర్పరచు మ్రొక్కెదనేను ॥పుర॥

కా—తరళాక్షినీమాట దెలుపా కెనేపక్షి
వరునిచే జెడిబ్రతికి వచ్చితియిప్పుడు ॥తరు॥

పద్మ—యిలలోప్రాణేశ నీకిలాగు యీయాయాసము
గలిగెనిప్పుడు తాళగలనెనెమ్మదిలోన॥

కా—నెలతయిదిగాక నేనిటనిల్వగానోప
పులుగు రేడుతో భీతిపొడమె నింతకుముందు

పద్మ—యిందునుండకమీరు యెందుబోయెదరయ్యా
సందేహమునులేక సరగూనజెల్పుమీ॥

కా—యిందీవరాక్షి కాళింద్రప్రాదినితీర
మందుగల మడుగులోనుండా మెల్లప్పుడు॥

పద్మ—వినుశాత్మజుండిందు వెదుకుచురాలేడ
మంమందునీకట్లు మరియోచించగనేల॥

కా—వనితపుట్టదొడ్డి పురివరుని వాహనమందు
మునిశాపమునుగూర్చి మొనసిరావెరచును॥

వ॥ అనిభార్యలకు యీమడుగువృత్తాంతమంత సవిస్తరంబుగ తెలియపరచి వారినొడంబరచి మంత్రితో యేమనుచున్నాడు.

గీ॥ మంత్రివరసంతోయుంచేల మంజుగాత్రి మణులతోఁగూడికాళింది మడుగుకిపుడు
జనగవలెనసుమ్మితడవైతె శకునవరుడునబాగలదుగానమదినిబ్బరంబుదోచె

వ॥ అని గాళీయుడు పుత్రమిత్రకళత్రామాత్యులతో రమణకద్వీపం

బును విడచి కాళింగమడుఁజొచ్చి యమ్మడుగులో మిక్కిలివిషంబుగ్రక్కి సకలజంతు భ్రష్టుండయి యుండెనంత, అక్కడనైన తేయుండు కాళియుని మృపత్వంబెరింగి యేమనుచున్నాడు.

క॥ ఇచ్చటనిలువక కాళియు డెచ్చటగభయమొంది నేపలన్నిటికూర్చి
వచ్చెదనని పోయెనుమెటు విచ్చేసెనో తెలుపుడా హివితతినిజముగన్॥

వ॥ అని పన్నగులతో కాళియునివద్వ్యాక్రమంబున కచ్చోరువండికో పమనస్కుడై.

దరువు ఆదితాళం

దరాచారుడెందరిగెను । వాని తెరంగెరిగితె గుతెలియంగనూ।దురంబు లోనిర్భయుండయ్యెను । వ్యరాధినిల చెచ్చెరం దెత్తువన ॥ద॥ పరాక్రమముగ లవో హానిని । దబ్బరలాడి ముందరీపని । యెరుంగకనునా ... రెప్పణంబులు పరానగొనితున పరాజితుందయె ॥దు॥ ధరామిట్టదొడ్డి పురంబున । భాసుర భక్తమందిరంబున । నిరంతరము వెనయు రాఘునేంద్రుని । స్మరింపుచునువిష ధరు న్వాదికెగను ॥బురా॥

వ॥ అని గరుడామంతుడు నిజనివాసంబునకుజనియె.

యశోదదేవి రావటం.

క॥ శ్రీకమలామణివాసది నాకరకులభూష వాసవార్చితసుమన
శ్లోగదయాసాగరహరి రాకేందుని బాస్కరరామ రాజలలామా॥

కీర్తన - ఆటతాళం.

శ్రీరమాహృదయాబ్జ భృంగా శ్రీసీతారామా । సద్విచారసాగర గర్వభంగా శ్రీసీతారామా ॥శ్రీర॥ చక్రశూనుతుపారవిక్ర శ్రీసీతారామా భూమిచక్రపాలన కంజనేత్ర శ్రీసీతారామా ॥శ్రీకర॥ రావణాగర్వహరాదిత శ్రీసీతారామా । దేవదేవదీనవిశేష భూరి శ్రీసీతారామా ॥శ్రీర॥ శ్రీమిట్ట దొడ్డి ప్రోలువాసా శ్రీసీతారామా । చిబుకరామదాస మనోవిలాసా శ్రీసీతారామా ॥శ్రీరామా॥

సూత్రదారివాక్యం

క॥ ఇందీవరాక్షులెల్లను ముందర వెనువెంటరాగ ముదములరగ నీ
వింౘేగు దెంచినిలచిన సుందరి వెవరమ్మమాకు సొంపుతొజెపుమా॥



యశోదవాక్యం ద్విపద

కన్నియవినవె నిక్కముగ మాటయొక్క | విన్నపంబెల్ల వేవేగ దెల్పెదను
త్రిదశాలయముసాటి దేదీప్యమొంది | పదపడివెలయు రేపల్లెమాప్రోలు
ఆపురంబేప్రొద్దు ఆనందముగను | కాపాడుచుండేటి ఘనుడునందుండు
మన్మనోహరుడు సామాజరాజయాన | సన్మునివంద్యుండు సద్గుణాఢ్యుండు
చిన్నిముద్దులుగుల్కు చెలరేగుభాసు | రోన్నతుండయినకృష్ణుడుయస్మదీయ
గారాబముననేను గనిపెంచినట్టి | చారుసుకుమారుండు జగతిలోపలను
పొలుపొందుమిట్టదొడ్డిపురివాసునెపుడు | దలచుచుండెటియశోదదేవినమ్మ

చెలికత్తెలవాక్యం

క॥ శరజాయతాక్షినందుని ♦ తరుణీమణివాటమేలుదనరగపింటి
తెరవెళ్లినీదుమహిమలు ♦ సరగునవినుపించవమ్మ సంశయమేలా

యశోదాదేవి తెరవెడలుకీర్తన ఆదితాళం.

వనితా తెర వెడలివచ్చెదనూ | మునుకొనిశాంతసమోదకమోప్రియ
వినయవివేకము వెలయగసభలో | ననుప్రసిద్ధికెక్కి | మించిఘనులకెల్ల
మొక్కి | నేనుదినమునుమనమునపెనువిటిపద | వనజయుగంబులువినుతిజే

సియుటు ॥వనితా॥ సరసిజాక్షులందరూను । సరెసారెయనివేడుచూను । విరతకుసుమపన్నీరుమేనమరి । మరిమగిజల్లుచుమణిభూషణములు సరగునసవరించా । సురఖేచరులుమింటగాంచా । పరివరివిధములవరునిమహాత్మ్యము తరుణులకునుకరమరుదుగ దెలుపుచు ।వనితా॥ కామితాధనములనువీూరాకిలికికాంచనకాంతులూరా । రామదాసాఖ్యకవింద్యుడయ్యధర । శ్రీమిట్టదొడ్డిపురిజేరి చెలంగిన ।భూమిజాతిపతినిఘనతర క్షేమ యోగతతిని ।సామజవరదుని హేమకిరీటుని । నామమెపుకుమదినియపరిచియుటు ॥వనితా॥

సీ॥ శ్రీమదకరలక్ష్మీకరుండగు రామచంద్రుని పాదకంజాతములను
నమ్మికౌడీన్యసాన్వయమునకీరాజన కూరిమిగలసత్కుమారుడైన
కూచనయామహాగుణునిసిద్ధుశ్రేణి అధికసుశీలరామాంబయనుగు
కాయజుండఖిలభాగవతాగ్ర్యపాదసేవాసక్తడగురామదాసుశౌరి

గీ॥ హృదయమునజేరి పలికించువిధముబలికె
కాలియోరగుమర్థనగానయిందు
తప్పులుండినదిద్దివాత్సల్యముగను
బ్రోవుడనివందనముజేసెబుధులునినుడి.

చెలికత్తెవాక్యం.

క॥ గొల్లవధూతిలకములతో వుల్లాసముగలిగిమిగులనొప్పించేటినూ
తల్లినీపేరెయ్యదో అల్లనవినుపించువిందుమానందముగకా॥

కీర్తన-ఆదితాళం.

జీవితాక్షివినవోయమ్మా । నాపేరుయశోదాదేవి యందు రెముద్దుగుమ్మా ।భూవలయములోనావిభునకధికద । త్రాసదానముగసేవలుజేసెటి॥ జీవ॥ మొక్కవసక్తిగలిగిపతులా । దైవంబనుకొనికడుమ్రొక్కి పూజింపుచుండెసతులా । కక్కజమగుచేర్పుకక్క నయ్యదశ । దిక్కులుపూజింపుచుండెసతులా । కక్కజమగుచేర్పుకక్కనయ్యదశ దిక్కులంచుపెంపెక్కి చెలంగేటి ॥జీవ॥ బృందావనమందుభోగ్యముగనూ । విహరింపుచునుకాళిందితీరముయోగ్యముగను । నందాహ్వయగోవిందపతికిజయ మందవ్రతములింబొందసలిపెటి ॥జీవ॥ శ్రీమిట్టదొడ్డిపూరిలోనా । నివసించినట్టినీతారా

ములవేడ్కతోనూ కోమలజలదాశ్యామజితేయుని రామయమనుహరినా మమ్మ:దలచెటి ॥జీవ॥

చెలికత్తెలవాక్యం

గ॥ చతురాస్యునితననాభీ । శతపత్రమునందుగన్న జగధీశుడుయే
గతిఁపేతవంశమునసీ । సుతుడై జన్మించెదెల్పుసుదతిలలామా॥

యశోదవాక్యం ద్విపద.

మతిగల్గివినవమ్మమాయొక్కపూర్వ । స్థితివేడుకలుమీఱజెప్పెదానీకు
మున్నుద్రోణుఁడనే ముఖ్యనకేను । పన్నుగధరయనూ పత్నినినయ్యి
నుండఁగయొకనాఁడు నొయ్యనపద్మ । జుండువమ్ముకలజేరి నవ్వెక్కుచుబలికె
వినుముద్రోణుఁడనీవు విశ్వంభరమున|వనితతోమనుజుండవై పుట్టుమనుచు
విన్నవించినయంత వెరగొందిప్రియుడు । క్రన్ననబలికె నక్కమలజుతోడ
దేవదేవయాజ్ఞ తెరగునమేము । భూవలయమునందు బుట్టెదముగాని
వనజనాభునినాదు వంశంబులోన । తనయునిగాగతద్దయువరంబొసగు
మనినయాగాకయనియంబుజాసనుడు । జనినపిమ్మటద్రోణసకలాత్ముడికను
నందుడై పుట్టి నేనతనికిముద్దు ! సుందరినై తి యశోదయనుపేర
నదిగాకమావంశమందు కృష్ణుండు|నయ్యెనిరతంబురక్షించునేముద్దుగుమ్మా

వ॥ అని వెండియు. కీర్తన - త్రిపుటతాళం

సరసిజాక్షివినవె శౌరిచరితమెల్ల తెలిపెద । పరమయోగ్యమయిన కీర్తిధరణియందునిలిపెదా ॥సర॥ పూతనయనుదాని గూల్చెభూతలమున శకటునిఁ । ఘాతజేసిదునిమె సుడిగాలిసోకునికటుల ॥సర॥ అంబుజాక్షులెల్ల విస్మయంబుజెందికాంచనూ! కంబుదారిమద్దిపాదపంబులనుయుడంచెను॥సర॥ వత్సబకాసురునిజంపి వత్సలమునుద్రోచె కడుసత్యలోక వరునిమహిమ నుత్సజింపజేసెను ॥సర॥ ధరణిమిట్టదోడ్డి రామదాసు నాదరించెను । నిరతము మాయింట లక్ష్మికరిముగావసియించెనూ ॥సర॥

గ॥ కందుపలువినుడినాప్రియ । నందనుడెందేగినాడొ నయమలరగయూ
బృందావనంబునవెతకియు పొందుగదోడ్తెండి ప్రొద్దుబోవకమున్నూ॥

వ॥ అనినగోపికలు శ్రీకృష్ణమూర్తి యన్వేషించుపుమఁడిరంత.

శ్రీకృష్ణమూర్తి రావటం





కీర్తన - ఆటతాళం.

శ్రీరాణిహృత్ఫుల్ల నీరజాతమరంద । సారంగవరుడా నేవినరా । సద్వి చారుడవై నేడుగవరా । శ్రీరాణిహృత్ఫుల్ల నీరజాతమరంద ॥సారంగ॥శ్రీరా॥ గొల్లభామల మెల్లమెల్లబోధించి ఒల్లిబిల్లిగ ముచ్చటాడుచు । యిందు అరు దెంచితి మురళి బాడుచు ॥శ్రీ॥ నెమ్మిపించము పైడిసొమ్ములు శోభిల్లక న్నా నివెన్న చెబూనియు । వేడుకతో నుండునుర క్షీరమానియు ॥శ్రీ॥ భూబాధలు గాగ యాదవకులమందు । ప్రబల్యము గజనన మొందితి సకలపాపములను బట్టిచెండితి ॥శ్రీ॥ భాసురమిట్టదొడ్డి వాసుడనై రామదాసునేలు కృష్ణదేవుడ సద్విలాసదాసులకుసంజీవుడ ॥శ్రీరా॥

మ॥ ఒకపార్శ్వంబునసుందరీమణులు బల్వారత్యాదరముల్ జూపిగం
ధకచోరావళులెల్ల బాయుదురు పద్మదృగ్వ్యగ్నవ్వేడవే
రొకభాగంబున జవ్వనాంగనలు తదోల్లాసముల్ గల్గిపా
యుక మోహంబున కౌగలించగ సునిత్యానందుడనై వచ్చితిన్॥

తెరవెల్పైకీర్తన - ఆదితాళం

బాలకృష్ణుడరా । వెన్నలుగలగోపాలకృష్ణుడనురా । పాలువెన్నదస గ్రోలినేడువసి । బాలులగూడి సలీలతోనాడెడి ॥బా॥ సుందరులతో కా

యుగతులజెప్ప విని దయామతిగల్గి విశ్వంభరములోన దశరథునకు జన్మించితి తాటకవనిలోన విశిఖాగము గ్రుంచితి కుశికావంశపాత్రికుని భూరిజ జన్మమెల్ల పశలీలామోఘ ప్రజ్ఞావతుడనై బ్రోచితిని ॥విన॥

అహల్యశాపంబు అవలీలగను బాపి ధూర్జటివిల్లు మెత్తి గ్రన్ననవిరచియు వసుమతితనయ నుద్వాహమాడి జమదగ్ని విచిత్ర సత్వము హరించి జనకుని శాసనంబున వధూమణి సౌమిత్రితో వనస్థలికి నేగి గుహునేలికై కేయికొమరునకు పాదుకలు వేవేగమే నొసగియు చిత్రకూటమున బలువయిన మోదామొసగియు చెలగ విరాధుని గూల్చి తుంబుర కాకాసురు గర్వకీలలన్ సదీర్చి తాపసులకు దత్తాభయము బాపి ॥కలు॥

మరిదండకాటవీమధ్య జరియించి గౌతమనదీప్రాంత పర్ణగృహమున నివసించి యుండ నిఖిలమౌనులు నాదు రూపులావణ్యాది రోచులెల్ల వీక్షింపుచును మహావిభ్రాంతిచిత్తులై కడుభక్తితోడను గారవించి రాఘవనిను గూడి రమియించనేరని జన్మమెత్తగనేటికి తపమేలాయె దెబల్ సన్మార్గమగు మాపాటికి మన్మథక్రీడలచే మానుని వెల్లదీర్చి చిన్మయాకారుని లో జేర్పుకోవయ్య వేరే ॥జన్మ॥

అని వారు చరణద్వయములపై తమ ఫాలతటములు మోపి వందనము జేయు యత్తాపసులపై దయాళుండనై వారు వినఘుగంభీర విహితమృదుల భాషలతోడ తప్పనియ భయంబొసంగి మిమ్మిపుడు యంగీకరించ తగదు ముందర వచ్చు ద్వాపరయుగమందు భూభారమణచ బుట్టియు గోపికలై వీరు శోభిల్లగను చేపట్టియు ఈ బారమున నా స్మరుని క్షోభలన్నిటిని దీర్చి నాభిప్రాయము తగ తుద మోక్షంబు నొసంగనేను ॥భూభా॥

పరమిట్లొసంగి రావణుని చెలియను భంగపరచి ఖరదూషణుల పరిహరించి మారీచు నొంచి శబరిని రక్షించి వాలిని బరిమార్చి సుగ్రీవు నేలి శరధి బంధించి దశగ్రీవు నొంచి లంక విభీషణునకు నేలగ నొసంగి సాకేతపురి జేరి జగతి యేకాదశ వేల వర్షంబు లేలియు కృష్ణుడనై దుష్కృతాళి సంహారిపోలియు శేలాగ రాముదాసువాలోకించి మిట్టచోడ్డి ప్రాంతాలో వెలసి భక్తజాల మానందమొందద ॥వేల॥

మంత్రికొనియాడుట కీర్తన.

వందనమిదె వారిజనయన । కుందరదన కాకోదరశయనా ॥వం॥ శ్రీధర తులసీదళమాలా । రాధాప్రియదర్పణ వక్షహారా ॥వం॥ తాపసవినుత మృదుచరణా । గోపామలకరవ కులాభరణా ॥వం॥ పూతనమద భూధరకులిశ పాతకహరసుర పామ్నతకలిశా ॥వం॥ క్ష్మామిట్టదొడ్డి సౌధవిహారా । రామదాస యారాధితకారా ॥వందన॥

వ॥ ఆసమయంబున వృద్ధవుండు యశోదాపంపు వచ్చి వెన్నునితో యేమనుచున్నాడు.

వృద్ధునికి కృష్ణునికి సంవాదం.
ఆటతాళం.

వృద్ధ—చిన్నదొరశౌరి విన్నవించెదనొక
విన్నపముగలదు ననుమన్ననగావించియు ॥చిన్న॥
కృ—పన్నగనుగోపాల ధన్యమతిగల్గినాకు
క్రన్ననాయావార్తయు తిన్నగను దెలుపవోయి ॥పన్న॥
వృద్ధ—నెమ్మిపురిదారినిను సమ్మతియుగలిగినేను
రమ్మనియశోదా దేవిముమ్మలనుదోలించెను ॥చిన్న॥
కృ—అమ్మనను యెందుకొరకిమ్ముగను రమ్మనియె
క్రమ్మరవచించరోయి నెమ్మదిలోనీతిమీర ॥పన్న॥
వృద్ధ—జీమూతసమాంగ హరి దామోదరశౌరికృష్ణ
స్వామియావారణమాకు యేమొకని తెలియదాయ ॥చిన్న॥
కృ—భూమిమిట్టాదొడ్డిపురి హేమమూలయందునేను
క్షేమతోవసించియట కేమారకనువచ్చెదను ॥పన్న॥

వ॥ అనిగోవిందుడు గోపబాలులంగూడిజననిసదనంబునకుబోవుచున్న సమయంబున యశోదాదేవి యెదురుగావచ్చి యేమనుచున్నది.

యశోదకు కృష్ణుని సంవాదం ఆదితాళం

యశో—రారానాచిన్నమొలుకా । నారాముచిలుకా
చారుముఖకాంతిగులుకా । ముత్తియపులొలుకా

